


# ప్రణయ ఫలితం

## సుప్రసిద్ధ సినిమాతార మేరీ పిక్‌ఫోర్డ్‌కన్య ప్రణయవాహికలు

'ప్రేమించుసుఖముకై!
ప్రేమించుము క్షికై!
ప్రేమించు ప్రేమకై!
........ .. ...!'

పిక్‌ఫోర్డ్‌కన్య ఈలోకాతీత అసమానసౌంద ర్య రూపవిలాసాలతో 'విశ్వప్రియ' స్థానం అలంకరిస్తూవుంది కాని పదిహేడుసంవత్సరా ల్క్రితం ఈసౌందర్యరాశి ప్రపంచపుయేమూల మూలలో జీవితాన్ని గడుపుతూవున్నది యే వ్యక్తికీ తెలియదు. అప్పటి ఈమెపసి అమాయ కత్వం, అసహాయత్వం వర్ణనాతీతం యిప్పట్లో నిర్భయంగా, నిస్సంకోచంగా తయణహృద య్యాలని అకర్షిస్తూవున్న ఆమె నేత్రాంచలాల లోని వోరచూపులు వొహప్పుడు దర్శకుడి, మరి కొంతరి నటనల సాధారణ, అమాయికదృష్టు లకి సిగ్గుతో తలలు వాల్చుకున్నవన్న సంగతి ప్రపంచంలో యెందరికి తెలుసుననీ-

ఈ అనన్య సామాన్యమైనమార్పు ఆమెలో వొహచిన్న ప్రణయసంఘటనవల్ల కలిగిందని సాకకులకితరుగా చెప్పాల్సినపనిలేదనుకుంటా

ప్రపంచపు మాయమాటలు కలయ చెటికి మొ ట్టమొదటిసారిఅజ్ఞాతంగా బయటని ఈడుస్తూ వున్న మేరీని వెలుగులోకి తీసుకొచ్చిందిఅసలు గ్రిఫ్త్-

మేరీబాల్యంలో చాలా అమాయకరాలు ప్రేమ, అనురాగమంటే యేమిటోయింకా తె లుసుకోని బాల్యావస్థలోనే గ్రిఫ్తుఈమెని పిక్చ ర్లకోసం తయారుచేయటం మొదలెట్టాడు. కాని కార్యసఫలత సూచనలుఅప్పట్లో అతనికి ఎంత దర్శకుడికి చాలాకష్టంగా తోచింది- నానావిధాలుగా ప్రయత్నంచేసాడు- సహ జంగా ప్రసరింపచేయాల్సినటువంటి ప్రేమని కృత్రిమంగాచూపడం ఫిలింసాంతానికి కళం కం అపాదించవమవుతుంది- కృత్రిమంయెప్ప టికీకృత్రిమంగానే వుంటుందికాని సహజంగా వుండదు- కృత్రిమత్వాన్ని సహజానికిమల్లేపరి దర్శించడం యిల్లాంటివిషయాల్లో చాలాకష్టం దర్శకుడిహృదయఖాండం నిస్పృహవల్ల మిం మీరి తొణికిసలాడుతోవున్న సమయంలో వొహయోచన ముందుకిదూకి ఈవిచిత్రసంఘ టనని మోదాంతంగా మార్చివేశాడు- దీనివల్ల దర్శకుడి ఆశయంనిధించింది- మేరీని జీవితసో పానంలో అత్యుత్తమస్థానం అలంకరింపచేసే కాంతికిరణాలు, వెలుగడలగాఢంగా అలుము కునివున్న కారుచీకటినిచీల్చేసి, నన్ననిమార్గం తెలుసరించాయి- పర్యవసానంగా మేరీవినపథా నికి యీ సున్నావు ఏవిధికి అనన్యసామాన్యమైన పరాజయంకలిగింది-

మేరీకి ప్రేమనిశ్పెట్టి ఆమెజీవితంలో దై తన్యంకలిగించిన వ్యక్తి తయణవయస్కుడైన అర్విన్‌మూర్-

అతివిన్ పదిహేనుసంవత్సరాల అమాయి కయువతిని చూసాడు- వుంగరాలకెరటాలు, కాంతులీనే తెలికన్నులు, సన్ననిగులాబిరంగు తూవుంది వొహచెట్టుకింద ప్రవాహానికి అ ద్దంగా కొట్లుచాచి అరివిన్,మేరీలు వొకరిని వొకరు గాఢంగాఅలుముకుని, తలకితల అన్చి ప్రపంచక్లిష్ట సమస్యలన్ని ఈవుట్లు ప్రజలకే వొ దిలి, ప్రపంచంలోనే ప్రపంచానికి వీలయినం తదూరంగా కూర్చున్నారు

మేరీచెక్కిళ్లు ప్రేమానురాగంతో సంధ్య కిరణాలకిమల్లే వొక్కువ్మడిగా యెర్రబారా యి కళ్ళల్లో దివ్యకాంతులు ద్యోతకమయినా యి. అ క్షణిక దివ్యఅనుభూతిలో మైమరచి, వాతావరణ నిశ్శబ్దాన్ని చీల్చి, చంచాడే ఆం దుకొఅన్నట్టు మేరీపెదిమెల సన్ననివొణుకు, శబ్దాలుగామారింది.

అ-రి-వి-న్-నిన్ను-నేను-ప్రే-మిస్తూ-వు న్నాను-

మాటలు ఉద్రేకంలో లీనమయి సన్నగా వొక్కొక్కటిగా పెకిలాయి-

కొంచెం దూరానవున్న గ్రిఫ్త్-తాను నాటి నమొక్క సస్యవంతంగా వృద్ధిపొందడంచూచి హర్షపులకాంకితుడై, పిచ్చిగా గంతులువేస్తూ వ్యాటిని ప్రదేశార్ణవంలో వీలయినంత దూరం విసిరి, "మేరీ,ప్రేమప్రదర్శనంలో నీవు అద్వితీ యురాలివి, యేదోవొహనాడు నీయశశ్చంద్రి కలు బ్రహ్మాండమంత వెలుగుగామారి, ప్రపం చంలో ఆచంద్రార్కంగా నిలిచిపోవుటం ము మ్మాటికీ నిశ్చయ"మన్నాడు.

గ్రిఫ్త్ జ్యోతిష్యంగా చెప్పిన అశీర్వచనం పూ రికపోలేదు-యెంకరికైనా సందేహంవుంటే మేరీ పిక్‌ఫోర్డుని వొహమాటుదర్శించి సంశయాన్ని తీర్చుకోవ్మని నామనవి-

మేరీ యశశ్చంద్రికలు సన్నగా ప్రపంచం నలుగడల వ్యాపింపసాగాయి. యశస్సుతోపా టు, గాదకుషుప్తిలోంచి వొస్కమడిగా మే ల్కొన్నప్రేమకూడా వృద్ధిపొందటం మొద లెట్టింది

ప్రేమబల్లన ప్రపంచపు ప్రతిబంధకాలని ఉ ల్లంఘించేయకుండా క్రమశః ప్రవహించడం మొ దలెట్టింది.

ప్రపంచం స్వచ్ఛప్రేమనిచూచి సహించ దు-ఈర్ష పడటమేకాకుండా వొహొహప్పుడు వినాశనానికికూడా అది కారణభూతురాలవు తుంది

వొహ అనివార్య కారణంవల్ల కొన్నివారా లకోసం అరివిన్ న్యూయార్కు వెళ్లిపోయాడు

మేరీతల్లి ఈసమయాన్ని పురస్కరించుకొ ని అరివిన్ న్యూయార్కులో పెళ్లి చేసుకున్నా డని మేరీకిచెప్పింది

మొదట్లో మేరీ అమాయికహృదయం ఈ వార్తని నమ్మలేకపోయింది-కాని తల్లి,మరీమరీ చెవుల్లో యిలుకట్టుకొని చెప్పటంవల్ల నమ్మి అ ఘాతంగంవల్ల మూర్ఛిల్లింది.

తల్లి తను పన్నిన పన్నాగంవల్ల కూతురు మూర్ఛిల్లిందని తెలుసుకొని, మేరీ కాస్త తెప్ప రిల్లినతరువాత నిజంచెప్పేసింది

న్యూయార్కునించి అరివిన్ తిరిగివొచ్చాడు

ప్రియులప్రేమకి పరమావధి వివాహమని ని శ్చయించి, వొండొయలని వొహవిధంగా బం ధింపచేసుకునేఅందుకు పరిణయమాడారు.

కాలచక్రం తొమ్మిదిసంవత్సరాలు వొస్కు తెలియకుండా చుట్టేసింది-

మళ్లీ కర్కశంగా మేరీ తల్లివాళ్ళ ప్రేమప థంలో చేయిచేసుకొని శాశ్వతంగా వాళ్ళని విడదీసింది.

అరివిన్ ఫిలిం నటనని, మానుకొని కెనడా లోని నిర్జనప్రదేశాలకి వెళ్లిపోయాడు

మరి మేరీ-

## భాస్కరభట్ల కృష్ణారావు

పోవకట్టలేమ. నిస్పృహచెందకండా, విరతీవి రామంలేకుండా, ప్రారంభించిన పనినిసాగ సాగించడంకోసం పలువిధాలుగా ప్రయత్నిస్తా డు. ఈ కుట్లప్రపంచపుకర్మనియమాలు, సు ఖదుఃఖాలు, సొదుదొడుకులు అంతవరకు అర్థం చేసుకోని అతిఅమాయకత్వం వాటికిజవాబుగా నిలిచే కృత్రిమనటనని మాత్రం సులభంగా అర్థంచేసుకోగలదా? అ ల లి త హృ ద యం లో అ ప్ప ట్లో కృ త్రి మ త్వా నికిస్థానంలేదు ప్రేమలేకపోయినా ప్రేమమా పి, లేనిపోనికుర్చ, అసహ్యం తెచ్చిపెట్టుకొని బాధపడటంమేరీకి అసమంజసంగాతోచింది. స్త్రీసహజశీలాన్ని, ముగ్ధత్వాన్ని వొదులుకొని బట్టబయలుగా నటించాల్సి వొచ్చినప్పుడు మే రీకి కళ్లనీళ్ల పర్యంతరంకూడా అయ్యేది.

రెండుసంవత్సరాలు గడిచాయి,

మేరీ గమ్యస్థానానికి యింకాయెంతోదూ రంలోవుండింది దర్శకుడిహృదయం, యెడతె రిపిలేని కృషివల్ల ఒసిగి చేసేదేమీలేక హానంవ హించింది-

కొన్నిరోజులు నిశ్శబ్దంగా గడిచాయి-

సరే యెల్లాగైతేనేమి మేరీకిసరియైన శిక్షణ యివ్వకుండానే గ్రిఫ్త్ వొహఫిలింలో ఆమెని తీసాడు- ప్రేమవాహికలు హృదయంగభీర తల్లోంచెలకలెత్తంది వొహవ్యక్తిప్రేమని నటిం చడం కష్టసాధ్యం- ప్రేమని, ప్రేమస్ఫురించా నిహృదయం తీవశీలపుట్టిపడేట్టు వ్యక్తపరచ డం లోకాతీతవిషయం- మేరీకిప్రేమంటే యే మిటో అంతవరకుతెలియదు- గంటారెండుగం టల్లో ప్రేమసామ్రాజ్యంయివ్వడం మనుష్యమాత్రు ని అలుముకొనివున్న తెల్లనిచెక్కిళ్లు, బాగా వొంపుతిరిగి వుబుకుల్లోకిజారుతూవున్న బుజాలు చూచి ముగ్ధుడైనాడు- సన్ననిచిరునవ్వు అతని పెదమెలపైవచిగిర్చి, నాట్యంచేసింది- అతినిచి రునవ్వుకిజవాబుగా మేరీసిగ్గలి తల, కళ్లువా ల్చింది- మరునిమిషంలో యిద్దరిచూపులు కలి శాయి- ప్రియులనిశ్శబ్దంగా కళ్లద్వారా పల కరించుకున్నారు- యిద్దరిపెదమెలవొణుకు-ని దురిస్తోన్ననీళ్లలోని సన్ననితరంగాలకిమల్లే, అ లసత్వంగా చలనంచేసినా—శబ్దాలుగామార లేదు-

యిదిమేరీ, అరివిన్ మొదటిప్రేమకలయిక.

ప్రతిరోజూ యిద్దరూ ఫిలింతీసే అప్పుడు క లుసుకునేవాళ్ళు కొంచెంయెడంగా, సంకో చంగా తిరిగినా వాళ్లహృదయాలు మాత్రం అ న్యోన్యంగానే ప్రవర్తించేవి

ఫిలిం దాదాపు సగంవరకు పూర్తిఅయింది వొహఘట్టం తప్పితక్కిన ముఖ్యఘట్టాలన్నీ వి జయవంతంగా తీశారు ఫిలింపెద్దలు కానిమిగి లిన ఆవొక్క ఘట్టంమాత్రం తక్కిన సీనుల న్నిటికీ రామణీయకత చేకూర్చేసుట్టం-

సాయంసమయంప్రకృతికన్య శృంగారంకొన్ని భాగాలని అనుచ్ఛాదితంగా వొదలటంవల్ల ని గ్గిలి కొన్నిప్రదేశాల్లోమాత్రం నిండుగా పచ్చ నిచెట్లతో పొదలతో, వాసనలీనే ప్రసూనా లతో కప్పుకుంది. క్షితిజరేఖకి సమీపంగా వొ హెతుకుని తనమనోభీష్టం యీడేరటంవల్ల సం తోషాతిశయాన్ని పట్టలేక పొంగుండా స్నా లుతీసుకొని అల్లరిగాచల్లిందా అనట్టు,అకాశం లో శోణితవర్ణం పశ్చిమంలో దృగ్గోచరమవు

# గడ్డాల మీసాల శోధన

(మిత్రగుప్తుడు)

చరిత్రచదివితే గడ్డాలమీసాల చరిత్ర బయలుపడుతుంది. స్త్రీనుండి పురుషునివేలుశే యాలంటే గడ్డాలుమీసాలుండితీరాలి. కాని ఈవిషయాన్నిగురించి అందరు యేకీభవించుట లేదు- మరి వివిధకాలాల్లో వివిధఅభిప్రాయా లుదయించాయి అంతేకాకుండా చిత్రాలుకూ డాజరిగినాయి

అతిప్రాచీనకాలంలో పురుషులికి స్త్రీలకి సమానంగా వెంట్రుకలుండేయి- చంద్రగుప్త మౌర్యునికాలంలో పురుషులకుసైతం తలవెం ట్రుకలున్నట్టు చరిత్రలు తెలుపుతున్నాయి-చం ద్రగుప్తుడు తనవెంట్రుకలను పండుగదివాల్లో శుభ్రపరుచుకొనేవాడట-ఇహ మహాత్ములు, ఋ షులు,పెద్దవార్లు వెంట్రుకలు, గడ్డములుంచుకొ నినవిషయం విదితం గడ్డముంచుకోటం పవిత్రచి హ్నంగా భావింపబడుతూవుంది- సాధారణం గా పాశ్చాత్యదేశాల్లో గడ్డాలుమీసాలు కొరి గేస్తారు, ప్రాచ్యప్రాంతాల్లో గడ్డాలమీసా లు దీసివేస్తారు-

మూడువేలసంవత్సరాలకు పూర్వం- ఈజి ప్టులో యూదులు బానిసజీవనంగడుపుతుండ- వీరుపొడుగైన గడ్డాలుంచుకొని, వాన్ని గౌర వచిహ్నంగా తలంచేవారు, వారినాయకులు ఈ జిప్టియనుల- ప్రతిదినం క్షౌరకల్యాణాల్లో ము గ్నులైయుండేవారు- గడ్డముంచుకోటం అనా గరిక లక్షణమని యూదులుతలంచేవారు-రో మనులు మరియు గ్రీకులుసైతం అభివృద్ధిమార్గాం దుదాకాశాన ప్రచండంగా ప్రకాశించే దినా ల్లో గడ్డాలమంచుకోలా గడ్డాలుంచుకోటం వీరికి దుస్సహంగావుండె- యూరోపియనులు వీరికేఅనుకరించి గడ్డాలుతీసివేశారు- అలగ్జాం డరు- తనసైనికొధికార్లకు సైనికులకు గడ్డాలు తీసివేయాలని- రాజశాసనంచేశాడు- ఇలాచే యుటంలో ప్రతిసైనికుడు యువకుడుగా అగు పడ్డాడని అతని అభిప్రాయం ప్రతిసైనికుడు యువకుడుగాఅగుపడ్డే శత్రువునికంపింపచేయు టం సహజంఅన్నాడు- అందుచేతనే కాబోల సేడుకూడా ప్రపంచసైన్యాల్లో గడ్డాలుంచు కోవటం యాచారంగాలేదు-

అనంతరం క్రీ-శ-౧౫౫౦లో రష్యా సా ర్వభౌముడైన పీటరుద్రిగేటు-గడ్డముంచుకొన్న వారికిగడ్డపన్నుకట్టాలని శాసించాడు-అక్బరు చక్రవర్తి యితోతేతొక్కడని బదాయూనీ చరిత్రకారుడు వ్రాసేశాడు.గడ్డానికి పన్నుగట్టే వారు- ఇంగ్లాండుప్రథమమున గడ్డపన్నువిధిం చింది- కొందరు,గడ్డాములపన్నువిధించితే జు ట్టుపన్ను విధించారుకొందరు-

సిక్కులు క్షౌరంచేయరు- వారిలో వొక విశేషంవుంది.యేమంటే భగవంతునిప్రసాదమైన వెంట్రుకల్నివుంచుతారు- పొడూగడ్డాల వారికే జీతాలివ్వబడునని మహారాజ రణజిత్తు సింగుప్రకటించాడు- ఆకాలంలో గడ్డాలుం చుకోటం గౌరవంగావుండెది

ఇంగ్లీషు పరిస్థితులుచూడండి గడ్డముంచుకో నే అచారంఅక్కడలేదు- ౧౫౫౦లో జార్జి ఫ్రెడరిక్ గడ్డంతో పార్లమెంటును ప్రవేశించా డు- ప్రజలు గడ్డాన్నిజూచి నవ్వారు, మేకకు గూడ గడ్డముండునని, అతనితో గొంచను పరి హాసమాడారు- కొన్నిసమయాల్లో అందుకేచే తిలోకి పెట్టేవాడు-జనులుభయపడి గడ్డాన్ని ముట్టుటంమానేశారు- ౧౭౫౦లో ఎక్ మండ్ లారెన్స్ గడ్డంతో ప్రచారానికి బ యలుదేరి ఫేడకన్నెక్క డోకసారి- గడ్డాలుం చుకోవాల్సిందని అభిప్రాయమిచ్చాడు జార్జి డోసన్-

మొంగలుచైనావారు నేపాల్ గడ్డముంచు కోవాలనేవారుకారు యెందుకో- అస్ట్రియా, జర్మని, హైద్రాబాదు గడ్డాలఫేషను చిత్రం గావుంటుంది- మీసాలుండి సగంగడ్డంతరిగేసి కొంతటు కొంతయిం చేశేకో, లేక సన్నగా గడ్డాలదిద్దుకుంటారు- విలియంకైజరు జర్మని చక్రవర్తి, ఫ్రాన్సుదేశపురాజు అస్ట్రియారాజా జోజెఫ్ గడ్డాలుంచుకొనేవారు- ఇంకా పైకి బోతే స్త్రీలకూ గడ్డముండుదంట- కొన్నిదే శాల్లో-

ఇరువైరెండో ఇరువైమూడో సంవత్సరాల మాట- ఆంగ్లయూదాన్నిబట్టి అంటుండేవారు- అకాలంలో లార్డుకర్జను భారతదేశానికి వైస్రాయి, క్రొత్తఫ్యాషన్ ఒయెండదేశంనిండా లుమీసాలు రెండు సాఫ్‌జేయుటకు మొదలె ట్టారట లార్డుకిచనర్ మీసాలుంచుకోవలసిం దని ప్రకటించారందుకనే

పూర్వకాలంలో ఎవరైనతప్పుచేస్తే వాని మీసాలు గడ్డాలుకొరిగి, బోడితలపై సున్నపు బొట్లుబెట్టి గాడిదపైకూర్చుండబెట్టి యుత్సవం చేశేవారట, విశేషంగా యీపద్ధతి చంద్రగు ప్తమౌర్యుని కాలంలోవుండెడి- కార్యన్నిచే యలేకపోతే- గడ్డంమీసాలు తీసేస్తానని ప్ర మాణంచేసేవారు- అవేదిలేమండా-సులభంగా గడ్డాలుతీసివేస్తున్నారు- పూర్వులోకసామెత చెప్పారు- "ఒక్కనాటి భాగవతానికి మూ డుమీసాలుకొరిగించుకోటం" అందుకే మననాటి కాల్లోనివారు మీసాలు కొరిగించుటం-మొత్త ముపై యీరోజుల్లో యీవిచ్చవిడిగా మంచి చలామణిలోవుంది మనజంటిల్‌మెన్‌వర్గం ఈ విషయంలో ముందంజవేసి మార్గంచూపింది- గడ్డాలమీసాల శీకరులేదు. మనహిందువుల ఆ చారాలు మనకుతెలిసినవే అయ్యావార్ని చేయ బోతె కోతియయ్యేనంటారు కొందరు. చేతనైం తంతవరకు పరిశోధించి రిపోర్టుఅందజేశాను మి త్రులుకొందరు పరిశోధించివుంటారు, మాకు మాసంఘానికి పత్రికద్వారా నివేదిస్తే స్వీక రిస్తాం.

యెన్నోరోజులవరకు మళ్లీ అమె మనిషికా లేదు- పిచ్చిగా వొంటరిగా దినాలతరబడి చీ కటిగదుల్లో తన్నుతాను బంధించుకొని కూర్చు నేది అప్పట్లో ఉన్మాదరేఖలుకూడా ఆమెలో కొన్నిపొడమూపాయి-

జీవితంలో యెన్నిమార్పులువొచ్చినా, గా ఢంగా గాయపడ్డ హృదయంమాత్రం మళ్లీకో లుకోవడం కడు కష్టసాధ్యం.

# గోలకొండపత్రిక

ఈశ్వరనామ సం॥ర శ్రావణ శు॥

గురువారము

# పంచదార పరిశ్రమ.

ఇండియా ప్రభుత్వమువారు ౧౯౩౨లో టారిఫుబోర్డుసూచనలనుసరించి దేశమందలి పంచదారపరిశ్రమను విదేశీపంచదారపోటీనుండి కాపాడుటకయి ఏర్పరచిన సంరక్షణసుంకమును పునర్విమర్శనచేయు సమయమువచ్చినది. టారిఫుబోర్డువారు ౧౯౩౨ సంవత్సరమునుండి ౧౫ఏండ్లవరకు దేశీయపంచదార పరిశ్రమ సంరక్షణముకయి హండ్రెడువెటు ౧కి రూ ౭-౪-౦ దిగుమతిసుంకము విధించుటయేగాక నూటికి ౨౫వంతున సర్ ఛార్జీతీసికొనటకును సిఫారసుచేసిరి. ఈసంరక్షణపద్ధతి ౧౯౩౮ సంవత్సరానంతరము పరిస్థితులననుసరించి హెచ్చించుటనో తగ్గించుటనో లేక సంరక్షణమున కవ్యపద్ధతులు నిర్ణయించుటకుసూచింపబడెను. ౧౯౩౮నసమీపించుటచే, ఆసూచనలననుసరించి ఇండియాప్రభుత్వమువారు పరిస్థితులపునర్విచారణకై టారిఫుబోర్డును ఏర్పాటుచేసిరి. గడచిన మూడు నాలుగు మాసములనుండి దేశమునందువివిధప్రాంతములలోబోర్డువారివిచారణజరుగుచున్నది. ఇంతవరకు మైసూరుబొంబాయిరాష్ట్రములలో దీనివిషయమయి వివిధపక్షములవారి అభిప్రాయములను తెలుసుకొని టారిఫుబోర్డువారువిచారణార్థము మనరాష్ట్రమందలి నిజాంసాగరు సమీపమందలి పంచదారకర్మాగారమునకు వెళ్ళియున్నారు.

ఇండియా ప్రభుత్వమువారిదివరకొసగిన సంరక్షణమువలన మనదేశమందుపంచదారపరిశ్రమ కొంతవరకువృద్ధి పొందగలిగినను, యింకనుపరిశ్రమ స్థిరపడలేదని అధికసంఖ్యాకులు తలచుచున్నట్లు టారిఫుబోర్డువారు దేశమునందువిచారణ సమయమునగైకొనిన ప్రజాభిప్రాయములుస్పష్టపరచుచున్నవి. ప్రస్తుతస్థితిలో ఆసుంకము తొలగించుమాటనటుంచి తగ్గించినక్షణముననే యీదేశీయ పరిశ్రమకు గొప్పహానిసిద్ధించుటయేగాక ఇంతకాలముపొందిన అభివృద్ధిపెద్దతుఫానుకు, సమూలముగాపడిపోవు మహావృక్షమువలె అంతమగుననుటనిశ్చయము. కాబట్టి యిపుడవలంబించుచున్న సంరక్షణపద్ధతులనుయేమాత్రము తొలగించవీలులేదు.

ఇదేసందర్భములో ఆలోచింపదగిన ప్రశ్నయొకటిగలదు. ఇండియా ప్రభుత్వమువారొసగిన సంరక్షణమువలన దేశమునందు పంచదారఫ్యాక్టరీలు మహావేగముగా విజృంభించుచున్నవి. వీనియందలి ఉత్పత్తి —తయారుగాబడుపంచదార—మితిమీరుటయే పరిశ్రమకు నష్టము వాటిల్లజేయకుండుటకు. మితిమీరి విజృంభించకుండ ఒకవిధమగు నిర్బంధమేర్పరచదలచి ఇండియాప్రభుత్వమువారు ౧౯౩౪లో హండ్రెడువెటుగకి రూ ౧-౫-౦ యక్సైజుపన్ను (అనగా ఫ్యాక్టరీలలో వసూలుచేయబడుపన్ను) నిర్ణయించిరి- అది కొంతవరకు పభుత్వాదాయము హెచ్చింపజేయును అశ్వాసేరితులయికాబోలు యక్సైజుపన్నును హండ్రెడువేటుగకి రూ ౨లకు పెంచిరి. నేడు దేశీయపారిశ్రామికులు యాక్సైజుపన్నును తొలగించవలసినదని కోరుచున్నారు. దీనివలన దిగుమతియగుపంచదారపై సుంకరూపమున ఒసగినసంరక్షణవిలువ తగ్గుచుండుటయటుంచి అపన్ను తుదకు దేశీయులలోపంచదారకొనువారలపయి త్రోయబడుటవలన దేశీయపంచదార ఉపయోగముమీద నిర్బంధమో, లేక పారిశ్రామికులభరించి మరియొకరిపయి త్రోయకుండిన పారిశ్రామికులకు నష్టమేకలుగుట నిక్కము.

ఈటారిఫుబోర్డువారికి చేయబడినసూచనలలో ఇంకొకటి ప్రాముఖ్యత వహించినదిగలదు. అది చెరకుపండించురయితులకు చాల ముఖ్యమయినది. చెఱకుకు ఫ్యాక్టరీవారలిచ్చు ధరను రయితుకు ఎప్పటికిగానినష్టముకలుగకుండునట్లు నిర్ణయించుట. మైసూరు వ్యవసాయశాఖాధికారిగారు పంచదారధరనుకూడ ఒకవిధముగనిర్ణయించిరైతుకునష్టము కలుగకుండ కాపాడవలెనని కోరియుండిరి. ఈధరనిర్ణయపద్ధతి ఇదివరకే ఉదాహరణార్థము సంయుక్తరాష్ట్రములో, రాష్ట్రమునందు చెఱకు ఫ్యాక్టరీలమధ్య వినాశకరమయిన పోటీలేకుండజేయు సుద్దేశ్యముతో అవలంబించబడుచున్నది. ఈ పద్ధతి దేశమందంతటను అవలంబించినచో చెఱకుపండించురయితు నష్టపడకుండుటయే గాక, దేశమునందు ఫ్యాక్టరీలకేర్పడువినాశకరమైనపోటీ యంతమగును.

మనరాష్ట్రమందు బోధన్‌లో ఒకపంచదారఫ్యాక్టరీ త్వరలోనిర్మింపబడనున్నది. దానిసంరక్షణ సమస్య మనకుఅందోళనీయాంశము అది మన ప్రభుత్వమువారిశ్రద్ధను యాకర్షించుచున్నది. మనసంస్థానమునకు ప్రతి సంవత్సరము ౨౦౦౦౦టన్నులపంచదార, ౨౫౦౦౦ టన్నులబెల్లముదిగుమతి యగుచున్నది. జనసంఖ్యనుబట్టిఒక్కొక్కరికి౧౫. ౭నుఫాలబెల్లము ౩ పౌనుల పంచదార ఉపయోగించుచున్నట్లు తేలును. ఈపరిశ్రమ మనదేశమునందుసాగిన యన్యప్రాంతములదిగుమతినాగిపోవుటగాక అవసరమగునరకిచ్చుటనే ఉత్పత్తిచేసికొనియెగుమతియగుచున్న ధనమునకు యానకట్టనేనిలుపవచ్చును. దీనికి మననిజాంసాగరుప్రాజెక్టుక్రింద చక్కని అవకాశము గలదని పంచదారవ్యాపారప్రవీణులగు శ్రీవాస్తవగారును, టి. యస్. వెంకట్రామగారును విశదపరచిరి. కాని మనరాష్ట్రమందు పంచదారఫ్యాక్టరీఏర్పాటుచేయవచ్చునని విశదపరచిన వెంకట్రామగారి శిఫారసునందు దీనిసాఫల్యతకు ఇండియా ప్రభుత్వమువారి నిర్ణయదిగుమతిసుంకసంరక్షణమత్యవసరమని గలదు. ఆ విషయమే యిపుడు పునర్విమర్శింపబడుచున్నది. ప్రభుత్వము, మనవర్తకులు ఆసుంకపురక్షణ యేమాత్రముతెగ్గించవీలులేదని టారిఫుబోర్డువారికి తెలుపవలయును.

ఇంకొకవిషయము. సంస్థానములలో చెఱకుఫ్యాక్టరీలపై యక్సైజుపన్ను విధింపబడలేదు. బ్రిటిషిండియాలో పన్నుబాధ తప్పించుకొని లాభము పొందుటకయి బ్రిటిషిండియాపారిశ్రామికులు మనప్రాంతమునందు యత్నించవచ్చును. ఇండియాప్రభుత్వమువారు మనరాష్ట్రమునందుపంచదారయక్సైజు పన్నువసూలుచేయుటకు కోరవచ్చును. కానిఅతిశైశవదశయందలి యీపరిశ్రమ యక్సైజుపన్ను భరింపజాలదు. ఈయక్సైజుపన్నులో ఇండియా ప్రభుత్వము వారి ఉద్దేశ్యము మనరాష్ట్రములో ఇపుడుమొదట ప్రారంభించబడు ఫ్యాక్టరీనుస్థిరముగ నిలవబడుగలుగువరకు ప్రభుత్వమువారు ఇంకొకఫ్యాక్టరీ నెలకొల్పువారికి అనుజ్ఞనీయమని వాగ్దానమిచ్చియుండుటచేతనే నెరవేర్చబడుచున్నది, కాబట్టి మనము యక్సైజుపన్ను భరించవలసిన అవసరములేదు. మైసూరులో పంచదారపారిశ్రామికులు! "మాకువద్దోయీయక్సైజుపన్ను" అని మొఱపెట్టుకొనవలసినస్థితికివచ్చిరి. వెంకట్రామగారు తమనివేదికలో మనప్రభుత్వమువారికి యక్సైజుపన్ను విధించపెట్టియున్నారు. కాని యిప్పట్లోదానిని అవలంబించదగదు.

ముందుముందుపరిస్థితులు అన్నివిధములను సులభములుగలేవు. ఇటీవల కొన్నిమాసములక్రింద జరిగిన అంతర్జాతీయ పంచదార మహాసభయందు ప్రపంచములో పంచదార ఉత్పత్తిపరిమితిమించిపోయినదనియు, దానివల్లధరలుపారిశ్రామికులకును వ్యవసాయకులకునునష్టకరముగుకీరితి తగ్గిపోవుచున్నవనియు వివిధదేశములవారు ఘోషపెట్టి, భారతదేశ ప్రభుత్వప్రతినిధిగ పోయిన వంచదారనువిదేశములకు ఏగుమతిచేయకుండుట కొడంబడివచ్చిరి. కనుకమన పంచదారకు ప్రపంచపు మార్కెట్టులో అవకాశముపోయినది; మిగిలినది విదేశీయులమార్కెట్టుమాత్రమే. ఇట్లుప్రారంభదశలోనున్న పంచదార పరిశ్రమ సంచారముచేయు అవకాశముగల మార్కెట్టువైశాల్యము తగ్గినపుడు, జాగ్రత్తగనుండుటమనవిధి. విశాలమైన మార్కెట్టుఉండునపుడు రైతులకు వేరుపెనగవ్యాపారములోవలె మంచిధరలు సుభువుగావచ్చును. మార్కెట్టుసన్నగిల్లినపుడు రైతుకున్యాయమైన చెఱకుధరతగ్గవలెనన్న ప్రభుత్వమువారు ఆలోచించి ఒకధరనిర్ణయించి ఆధర అమలు జరుగునట్లు చూచుట ముఖ్యము.

# ౧౫౪, ౦౦౦, ౦౦౦ పౌండ్ల ధనం పాతిపెట్టబడెనా?

## పది అడుగుల లోతులోనేనా?

దానిని పదిలక్షల కళేబరములు కాపలా కాయుచున్నవా?

("ఉపకారి")

క్రీ॥ శ॥ ౧౬౮౫లో డేరానిద్ద్ అను ఒకభాటియారాజా పంజాబులోవున్న అచ్చుకు సమీపమున ప్రయాణంచేస్తూ వుండెను అతని ఒంటె కాలితో ఇసుకనుతన్నగా ధనందొరకెను-ఆధనంతో అతడు అక్కడనే దేరావరు అను కోటను నిర్మించాడు- ఆకోట సహాయంతో ఆ ఎడారంతా వశపరచుకొంటాను అని తలచాడు- మొగలులు సిక్కులనుఓడించిందాకా అనగా క్రీ॥ శ॥ ౧౭౩౩సం॥వరకూ ఈకోట డేరానిద్ది వంశంవారి స్వాధీనంలోనే వుండింది- అటుతరువాత ప్రస్తుతపు భావల్‌పూర్ సంస్థాన స్థాపన అచ్చటనేచేసింది నవాబు సిద్దీఖ్ మహమ్మదుఖాన -

ఈ భావల్పూరు సంస్థానంలోనేవున్న డేరావరుకు సమీపంలో ౧౫౪,౦౦౦,౦౦౦ పౌండ్లధనం పాతిపెట్టబడివుంది. ఎప్పుడు? ఎవరివల్ల? ఈప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే హిందూదేశచరిత్ర తిరిగేయాలి. క్రీస్తు పుట్టక పూర్వం ౩౨౬సం॥ ఫిబ్రవరినెలలో అలెగ్జాండరు, సింధునదినిదాటి హిందూ దేశంపై దండెత్తెను. అంతకుముందు ఎనిమిది సంవత్సరాల పూర్వమే తనస్వదేశం గ్రీస్ నువదలి కోశ్వలో పెర్షియా మొదలగురాజ్యాలను కాలితో తన్ని అటుతరువాత హిందూదేశంపై కన్నువేశాడు- అతడు తోడుకొంబడి కొల్లగొట్టిన ధనమే డేరావరుకోటకు (అప్పటికి కోటలేదు, సమీపంలో పూడ్చాడు. అదే కాదు ఇంకా అనేకచోట్లలో ఆఎడారులలో మనదేశంలో కొల్లగొట్టిన ధనాన్నికూడా పూడ్చాడని వదంతి. ఈలాగు పూడ్చడంలో ఆతనిఅభిప్రాయం ఏమిటంటే దండయాత్రముగించి తరువాత యింటికివచ్చేటప్పుడు, కొంతఏలావుండీ ఏలావచ్చినా, తనసైనానికి జీతాలు, బత్తాలుయివ్వకోసేందుకని భద్రపరచాడు కాని అతడు పంజాబులోవున్న అయిదునదులున్నూ పూర్తిగాదాటలేదు, ఒకఅడుగుకూడా ముందంజవేయమని సైన్యం భీష్మించింది. దాంతో నిరుత్సాహంతో సట్లజ్ అను యింటిముఖంపైపు త్రిప్పాడు. ఈ గందరగోళంలోనూ, దాచిపెట్టినచోట్లు సరిగా గుర్తుపెట్టుకోకపోవడం బట్టిన్నీ, అయినా అతడు మరొకదఫా నింపాదిగావచ్చి హిందూదేశ దండయాత్ర పూర్తిచేసుకొందామని అతడుఎక్కడపాతిపెట్టిన ధనం అక్కడనే వదలి వెళ్లిపోయినాడు. పోయిన మూడుసంవత్సరాలకన్నా తిరగకపూర్వమే పాపం చచ్చిపోయాడు. అతని హిందూదేశంలో వదలిపోయిన సైన్యాన్ని చంద్రగుప్తుడు చెల్లాచెదురుచేసి తరిమివేసినాడు.

అంతేగాదు. ఇంకా చాలాధనం అసమీపాల్లోనే దాచిపెట్టబడివుండికూడాను. అటు తరువాత అచ్చోట్ల పరిపాలించినరాజులు, దండయాత్రలకు భయపడి,హిందువులకు మహమ్మదీయులకు జరిగిన యుద్ధాలప్పుడూ, మొగలు దండయాత్రలు సలిపిన రోజులలో,మంగోలులు, తైమూరు, నాదిర్ షా మొదలగువారి దండయాత్రలప్పుడు, వారివారి ధనాన్ని ఆ ఎడారులలోనే దాచిపెట్టుకొన్నారు. పదమటికను మలగుండావచ్చిన ప్రతివారికీ ఆ ప్రదేశం యుద్ధరంగమనికూడా అందరికీ తెలిసినవిషయమే గనుక అటువంటిసమయాల్లో, అచ్చటి రాజులకూ, ప్రజలకూకూడా ఆ ఎడారులే బేంకులుగా వుపయోగపడ్డవి. ఇంకా ఈలాంటిధనం ఆ యిసుకదిబ్బలక్రింద ఎంతపడివుందో, ఎచ్చటెచ్చటదాగివుందో ఎవరికెరుక. సింధునది, దాని ఉపనదులు వాటి మొదట పారుచున్న స్థలాలనుంచితర్లి వేరువేరుమార్గాలు త్రొక్కినందువల్ల దాచిపెట్టబడినస్థలాలను అనవాలు పట్టడానికికూడా వీలులేకుండా మరీచిక్కులు తెచ్చిపెట్టింది.

ఈ అపారమైన ధనాన్ని పదిలక్షల మహమ్మదీయ మహాపురుషుల సమాధులు కాపలాకాయుచున్నవట. అలెగ్జెండర్ ధనం దాచివుంచిన అచ్చుకు సమీపంలోనే డేరావరుకోట దగ్గరవున్న మసీదు చాలా గొప్పది-అందులోనే మహమ్మదీయుల మహాపురుషుల సమాధులు లెక్కలేనన్నివున్నవి- ఇట్టిమహాస్థలం మొట్టమొదట ఏర్పడ్డానికి కారణం, సయ్యద్‌జలాలుఅను గొప్ప ప్రఖ్యాతిగడించిన మహమ్మదీయమహాపురుషుడు, బుఖారాలోపుట్టి, బాల్యమందే గొప్పగొప్పమహత్కార్యములనుజేసి. తరువాతజీవితమును సేవతో పావనంచేసుకొని, అచ్చట సమాధిఏర్పరచుకొన్న స్థలము. అటుతరువాత అనేకలక్షలమహాపురుషులసమాధులూ, భావలుపూర్ నవాబుల సమాధులూచేరి ఇప్పుడచ్చట గొప్ప మసీదుగానూ, మహమ్మదీయులకు పుణ్యస్థలము గానూ ఏర్పడ్డది. ఈచోటికి కూతపెట్టు దూరములోనే ఎచ్చటనో కొన్ని అడుగులలోతులోనే దాగియున్న అపారధనాన్ని ఈసమాధులు కాపలాకాయుచున్నవట-

కాని ఇప్పుడూ అచట్టు ప్రదేశమంతా నిర్మానుష్యము, ఒకానొకప్పుడు అచ్చోట అనగా క్రీ.శ.౧౪ సం.వరకు గొప్పపట్టణము, అయితే అలెగ్జాండర్ అచ్చటికి క్రీస్తుశకం పూర్వం వచ్చినప్పుడు ఎడారియే అప్పుడు చినాబ్‌పునది సింధునదిలో అప్రదేశమునకు చేరునన కలయుచుండెను. కాలము మారినకొలది నదులుకూడ వాటిమార్గములు దప్పినవి, ఇప్పుడో అచ్చుకు ఏభయిమైళ్లకు క్రిందనైపున కలయుచున్నది. పదునొకండవ శతాబ్దమువరకూ ఈ ప్రదేశం [అచ్చు] పాండురు అనేవాముతో ధనం, ధాన్యం: పుష్కల వ్యాపారముతో విరాజిల్లుచుండిన పట్టణరాజము, భాటియారాజులకు భూషణమై వెలుగుచుండిన పట్టణము, పదమూడవ శతాబ్దము మొదటిరోజులలో చితికిపోయెను. అటుపిదప వెంటనే మహమ్మదీయకాలములో మినాజుద్దీన్ అను పరిష్కారచరిత్రకారుని అజమాన్యమున గొప్ప మహమ్మదీయకాలాల అచ్చోటతెలసెను- అక్బరు చక్రవర్తి రాజ్యములోచేరి,నాదిర్ షా దండయాత్రకాలమువరకూ, అచ్చు మొగలుల సామ్రాజ్యములోచేరియుండెను-

అచ్చుయొక్క అప్పటివైభవమది- ఇప్పుడో డేరానవాబు సాహెబ్‌నకు పంద్రెండుమైళ్ళలో పాడుపడిన మూడుపట్టణాలున్నవి- అయినను మహమ్మదీయులకు పుణ్యస్థలము- ఎలన షాజాదావిషీర్ అధీనములో మహమ్మదీయ ప్రవక్తఆలపాగ దుస్తులును, హసన్ హుసేనీయుని ఖడ్గములును తదితర పురాతన వస్తువులు వున్నవని చెప్పబడుచున్నది-

ఈపుణ్యస్థలానికి సమీపంలోనే ధనంతాంది- అనేకమంది వెతికారు- భావలుపూరు నవాబులుకూడ ప్రయత్నాలుచేశారు- లాభం లేకపోయింది- అయితేఇప్పుడు ఒకమహమ్మదీయఫకీరు ధనందాచినచోటును దైవసహాయంవల్ల కనుగొనగలిగినాడట- అంతేకానిఇంకా ధనందొరకలేదు. పూర్వ గాధలప్రకారం మహాత్ములు గాలిలోఎగిరివప్పుడు, అఎడారి ప్రదేశమంతా వ్యాపారస్థలంగామారి వాహనములైనప్పుడూ, అధనం అంతా కనబడి, దీలావరు తిరిగీ పునర్జన్మ ఎత్తడమేకాకుండా, ప్రపంచమునకు మరియొక అద్భుతమును చూపునని ప్రతీతి.

ఈపైగాధనే నిజమైతే కొద్దిరోజులలోనే ధనం కనపడాలి. ఎందుకంటేఇప్పుడు అసలంపైన విమానాలలో మనుష్యులు విమానాలలో మనుష్యులు గాలిలోతిరుగుచున్నారుగా! ఎడారిని రైళ్లు దాటటమేగాకుండా మోటారులు కూతలుపెట్టుచూ వాలుగుమూలల గాలించుచున్నవి కూడానా! ఇక అధనము అకనపడటమే తటస్థించాలి ఎప్పుడో? — మరి ఎప్పుడూ!!!



# స్థానిక వార్తలు

### చిత్ర విచిత్ర విక్రయశాల

#### సీలోఫర్ రాకుమారిక ప్రారంభోత్సవము సలుపుట

బీదబాలుర సహాయార్థము ౬ అగస్టు తేదిన సికింద్రాబాదయందలి వెస్లీ చర్చివారు చిత్రవిచిత్ర వస్తు విక్రయశాలను యేర్పరచిరి, శ్రీ నీలోఫర్ రాకుమారికగారు దానిని ప్రారంభించిరి. భవనమంతయు సుశోభితముగా నుండెను. ప్రారంభోత్సవానంతరం రాకుమారికకై. యం. సి. యే వారి వివిధ ప్రదర్శనమునకు యాజమాన్యము వహించి వీక్షించిరి.

### రాకపోకలు

అజంటా యెల్లూరా గుహల మాదనేగిన కెనిడెంటుగారు సోమవారము నగరమునకు దయచేసిరి.

నవాబు సుల్తాను ముల్కుగారి పుత్రులగు హసన్ యార్జంగుగారు శనివారం యింగ్లాండునుండి వచ్చిరి.

షౌకతాలిగారు నగరమునకువచ్చి అస్గర్ యార్జంగ్ గారివద్ద బసచేసియున్నారు వీరు వై. యం. సి. యేలో సోమవారం రోజున "మహమ్మదీయ విజ్ఞానము" గూర్చి యుపన్యసించిరి.

మహమ్మదు యూనస్ గారు విద్యాభ్యాసానంతరము యింగ్లాండునుండి మొన్న తిరిగి వచ్చిరి.

### పంచదార టారిఫ్‌బోర్డు

ఇండియా ప్రభుత్వమువారు దేశీయ పంచదార పరిశ్రమ సంరక్షణార్థ మేర్పరచిన విచారణసంఘ సభ్యులగు సర్ జోసెఫ్ భోర్, యఫ్. ఐ. రహమతుల్లా, డా. యల్. ని. జేజి కార్యదర్శులగు బి. కె. భాట్యా సోమవారం రోజు బొంబాయినుండి యిచ్చటికరుదెంచి ఆ మధ్యాహ్నమే రైలులో నిజాంసాగరు వెళ్లిరి ౧౦ ఆగస్టు తేదిన తిరిగి నగరమేతెంచి ౧౧ తేదిన ఢిల్లీకేగదరు.

### క్రొత్త ఉద్యోగములు

పాఠశాలయందలి వ్యాయామ విద్యాశాఖయందు రు ౨౫౦—౩౦౦ వరకొక మదద్గారు; రు ౫౦—౭౦ ల వరకొక గుమాస్తా,మరొకభృత్యుని యుద్యోగము లంగీకరింప బడినవి.

### షౌకతాలిగారు

రైటు అనరబిల్ సర్ హైదర్నవాజ్ జంగుగారిని మంగళవారము రోజున షౌకతాలిగారు దర్శించిరి.

### మహారాష్ట్ర సాహిత్య మహాసభ

పై మహాసభకు పండిత శ్రీపత్ రావు బి- ఏ-, ఎల్ ఎల్- బి గారు ఔరంగాబాదు ప్రాంతముకో అధ్యక్షులుగా యెన్నుకొనబడిరి-

### అఖిలాంధ్ర కధకుల సమ్మేళనము

ఈ సంవత్సరము పై సమ్మేళనము రాబోవు సెప్టెంబరు మాసములో నగరమునందు జరుపుటకు ప్రయత్నములు జరుపబడుచున్నవి- శ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రియో లేక చింతా దీక్షితులు గారో అధ్యక్షులుగా నిర్ణయింపబడ నున్నారని నగర విలేఖరి తెలుపుచున్నాడు.

### ఇంజనీయరింగు కళాశాల

#### ధనాపహార అభియోగము

ఈ కాలేజియందలి రు ౧౨౭౫ లపహార అభియోగమునందు ఫౌజ్దారిసండి బర్కతుల్లాకు ౪ సం॥ కఠినశిక్ష ౨వేల రూప్యముల జుర్మానా విధింపబడినది- జుర్మానా చెల్లించని పక్షమున ౨ సం॥ల శిక్ష యనుభవించుటకు తీర్పు గావింపబడినది-

### శ్రీ జి. హెచ్. వీరన్న గారి అభినందనము

సికింద్రాబాదు ౨౬-౭-౧౯౩౭

గడచిన ఆషాఢ బ॥ ౧౧ సోమవారము సాయంకాలము శ్రీ మటిశ నాగయ్యగారి ధర్మశాలలో సుబ్బి శ్రీ చెన్నబసవేశ్వర నాటక సమాజాధ్యక్షులైన వినోద రత్నాకర, జి- హెచ్- వీరన్నగారికి, వీరశైవ గురుకులము, శైవ భారతీభవనము అను సంఘముల పక్షమున అభినందనపత్రిక సమర్పింపబడినది-

౫- గంటలకు, ఆంధ్ర ప్రముఖులును, వీరశైవ ప్రముఖులును ఇతర ప్రముఖులు, మొదలగువారును సభకు చేరుకొనిరి- సర్వజన కోరికపై శ్రీ మాడపాటి హనుమంతరావుగారు అధ్యక్షత వహించి- వీరశైవ గురుకులము శైవభారతీ భవనములను నిర్వహించుచున్న చి॥ వీరభద్రశర్మ గారి సేవను ప్రశంసించుచు ఇట్టి సంస్థల పక్షమున శ్రీ వీరన్న గారివంటి మహోదార చరితుల నభినందించుట చాల ప్రశస్తమని యుపన్యసించిరి- శ్రీ ఆదిపూడి సోమనాధరావుగారు "వీరన్నవంటి మహాపురుషులు దేశమునకు సంఘమునకును ఉపకారము చేయుచున్నారనియు అభినందన యోగ్యులనియు" నుపన్యసించిరి- డా॥ రుద్రప్పగారును వీరన్నగారి పరిచయమును సభికులకు సంక్షేపముగా నెరిగించిరి- శ్రీ కృష్ణశర్మగారు దుపన్యసించిన పిమ్మట, చి॥ వీరభద్రశర్మగారు, అభినందన పత్రికను చదివి వినిపించిరి- శ్రీ వీరన్న గారు ధన్యవాదముల నర్పించుచు లోకోపకారమే తమగురియనియు, శక్త్యనుసారము అచటచట సంఘములకు సమర్పించుటలో తమ భువతకే దనియు, ఈ వీరశైవ గురుకులమునకు గౌరవ వీరభద్రశర్మ గారిని సంప్రతించి సహాయము చేయుదుమనియు ఉపన్యసించిరి-

### విందు

నవాబు సాలార్జంగు బహద్దురుగారు షౌకతాలిగారిని నిన్న మధ్యాహ్నము విందునకాహ్వానించిరి.

## హైద్రాబాద ఆరోగ్యము

౩౧జూలైతో అంతమగువార మందలి నగర పరిసరగ్రామముల ఆరోగ్య వివరములు.

ప్లేగు

నగరము, పరిసరగ్రామములందు ప్లేగుకలక వ్యాధిగ్రస్తులు కాలేదు.

ఏగృహమునుండైనను ప్లేగుగల మూషికము పట్టబడలేదు.

మూషకమారణము యథాప్రకారముజరిగినది.

కలరా

జేడిమెట్ల, హైదర్గూడ కూనమ్మా బేటీడినుండి అంటువ్యాధి వైద్యాలయమునందు చేర్పబడిన ౩రోగపీడితులలో ౧రు చనిపోయిరి

ఇతరములు

విషమజ్వరము, మశూచికవి వాంతు లెవరును వైద్యాలయమునందు చేర్చబడలేదు.

## బాల్య వివాహ నిషేధము

### భారత దేశమందలి ఫ్రెంచు ప్రదేశములలో జరిగిన ౧ నెల శిక్ష.

పాండిచ్చేరి ౨౬-౭-౩౭

భారత దేశమునందు ఫ్రెంచు ప్రభుత్వమునకు లోబడియున్న ప్రదేశములందు బాల్యవివాహము నిషేధింపబడినది- బాల బాలికలకు వివాహ వయస్సు ౧౫—౧౮ సంవత్సరములు నిర్ణయింపబడినది-

దీనికి వ్యతిరేకముగా ప్రవర్తించు ఒధువులకు, తల్లిదండ్రులకు, పురోహితులకు, సంరక్షకులకు నొక నెలశిక్ష విధింపబడునని ప్రకటింపబడినది-

బ్రిటిషు పరిపాలనమందలి భారత దేశమునందు బాల్య వివాహములు పూర్తిగా నిషేధింపబడుటవలన యీ ప్రాంతమునందును పరిపూర్ణము నిషేధించు టత్యవసరమని భావింపబడినది-

## ప్రకృతి చిత్రము

### చతుర్భుజ చతుష్పాదము-

లక్నో ౨౬-౭-౩౭

ఇచ్చటి ఆస్పత్రిలో నొక యొక స్త్రీకి తొండము, రెండుకళ్లు, ౪ చేతులు, ౪ కాళ్లుగల యొక శిశువు జన్మించి వెంటనే మరణించినది శవము మాత్రము ప్రదర్శనమునందు భద్రపరచబడినది-

# హైదరీగారి నూతనప్రణాళిక

కార్యప్రణాళికవలన రాష్ట్రీయులందరు విద్యావంతులై
వివిధసమస్యలను స్వయముగాఆలోచించి పరిష్కరింపగలుగుట

అభ్యుదయము, అభివృద్ధికివలయు పద్ధతులాచరింపబడుమార్గములు
ప్రజలకు విశదపరచబడునటుల ప్రజలనుండి యీమార్గములు,
పద్ధతు లెంతవరకు సఫలతబడిసినది ప్రభుత్వము గ్రహించుచుండుట

## ప్రజాభిప్రాయము ప్రతిఫలింపజేయుటకు క్రొత్తయేర్పాటులు

"సైను చాన్సలర్ గారు యీసందర్భమున అంగ్లభాషద్వారా తమభావములను విశదపరచుటకు గనపరచినకారణములు పరుల అనుసారము యొదాహరణమనవచ్చును. "భోజనానంతర" విషయప్రకటనమున కీభాష మిగుల యుక్తమని వారువిశదీకరించిరి. వారి తమభావములను స్వతంత్రముగా వివరించుటకే యీభాషను వ్యవహరించిరి. నాభావముతో నేకీభవించి వారీభాషను భావప్రకటన సాధనముగా నిర్ణయించియుందురని నాకనుమానము కలుగుచున్నది. ఉర్దూభాషకన్న అంగ్లములో భావములను విశదపరచుట నాకెక్కువసౌకర్యము గలదన్నది నేనంగీకరించవలసి యున్నది. ఇతరసందర్భములందలివలె నేడుసహితము నవాబుగారు తమయుదాహరణముతో నానుసారము మొనర్చినందులకు నేనెంతయూ కృతజ్ఞుడను. ఇంగ్లాండునుండి తిరిగివచ్చినవిదులకేగాక నాప్రభువుగారిచే ప్రసాదింపబడిన యీముఖ్యభారము వహించినపిదప, దేనివిశేను నాజీవితసాఫల్యము గను, దేనివలన నేడీమహాగౌరవము బడయుటకు యవకాశములభించిందో అట్టి ప్రథమసందర్భము యీవిశ్వవిద్యాలయము సంస్థయేయనుట నిశ్చయము"ని పలికిరి.

ఇంతేగాక "వైసుచాన్సలర్ గారు ప్రేమపూర్వకముగా నేనొస్సిన యనేకకార్యములను గొప్పవిగా ప్రశంసించుచు విశ్వవిద్యాలయముతో నాకిట్టి సంబంధములేదని వివరించిరి. కాని నాప్రతికార్యమునకు యీవిశ్వవిద్యాలయముతో సంబంధముగలదని తెలుపుచున్నాను. విశ్వవిద్యాలయ మందలిమీ రాష్ట్రమున నూతనక్షేత్రములుద్భవించినాయి. ఈరాష్ట్రభవిష్యత్కార్యప్రణాళికను ఆచరణభాగ్యము కలిగించుబాధ్యత మీపైగలదు, మీరొక మహోత్తరమగు కావలసిన గారము. భావికాలమునందు రాష్ట్రపు పరిపాలనాసూత్రములను వాస్తవముగ నొనర్చుకొనుటకు కావలసినయువకులు మీనుండు పోతపోయబడుచున్నారు"నినుడివిరి.

"నేను మనదృష్టియాకర్షించుచున్న కార్యప్రణాళికవిశ్వవిద్యాలయపు విద్యార్థుల, ఉపాధ్యాయుల, రాష్ట్రీయులపరస్పరసాయమువలననే అనుకూలతత్వరలో ఆచరణభాగ్యంసఫలించిన, ప్రతివిషయమునందు ప్రయత్నింపబడుచుండునటుల, రాష్ట్రీయులకు వాక్కర్మలందు మనకు మార్గదర్శకులనుగుదురని నాకుసంపూర్ణవిశ్వాసముగలదు. కార్యప్రణాళికవలన రాష్ట్రీయులందరు విద్యావంతులై వివిధసమస్యలను స్వయముగా ఆలోచించి పరిష్కరింపగలుగుదురని నేనాశించుచున్నాను. కేవలము జీవనోపార్జనకేగాదు జీవితమునందు సౌఖ్యముగడించుటకు, నాలుగు భాగములందలి రైతులేకాదు, కర్మాగారములందు కృషిసలుపు కార్మికులేగాక విద్యుత్ శక్తి అనల్పధనమవలంబించియుండు శ్రీమంతులకు, వారికిచక్కని యవకాశములు దీనివలనకలిగితీరును"ని హెచ్చరించిరి.

"ప్రజలకోరికలు, అభిమతములు వేరుగా క్రమపద్ధతిలో ప్రభుత్వమువారికందజేయబడు సౌకర్యములుపరిపాలనమునందు దుర్వ్యవమని ఆశించుచున్నాను. అభ్యుదయము,అభివృద్ధికివలయు పద్ధతులాచరింపబడుమార్గములు ప్రజలకువిశదపరచబడునటుల వారినుండి యీమార్గములు, పద్ధతులెంతవరకు సఫలతబడిసినది. ప్రభుత్వము గ్రహించుచుండును. హైద్రాబాదయందు పాలకుల, పాలితులమధ్య యెట్టిభేదములేదు. వీరిద్దరభేద్యులుగాగలరు ఇద్దరిది- మిష్టి అదర్శము ఒకే. ఇద్దరివాకటి"యని తమహృదయభావము నవివరించిరి.

చివరకు "నాహృదయమందలి విషయముల నే బహిరంగపరచితిని కాని యిట్టిసందర్భమునకై ప్రత్యేకముగా తయారుచేయబడినవికావు. పరమేశ్వరుడు మీయందలి యున్నతభావములను యుత్కృష్ట కార్యములందు వినియోగింపజేయుటయేగాక మీవాక్కర్మలకై ప్రభుసేవయందు సార్థకమగుటకు ప్రార్థించుచున్నాను- దీనితో అపరమాత్ముని అనంత అనుగ్రహమువలన మనకృషికి, ప్రయత్నమునకు బలము ప్రసాదితమగును"ని పలికిరి-

భోజనానంతరము గౌరవనీయులగు విద్యాశాఖమంత్రియు ఉస్మానియా విద్యాపీఠపు వైస్ ఛాన్సెలరును అగు నవాబు మెహిదీయార్ జంగుగారు సర్ అక్బర్ గారి గౌరవార్థము ఉపన్యసించుచు తాముఉటీవలనే ఉన్నతోత్సవ మరే భాషలోగాని విశ్వవిద్యాపీఠము ఆవరణలో ఉపన్యసించవని చేసియుండిన ప్రమాణమును ఇపుడు నిర్బంధముగ అనుసరింపుటకు ఎవరుసు పట్టుబట్టునందుకు గాకయని ఆశించిరి- నాటిసాయంకాలము విందునకు కాలక్షేపమునకు ఇంగ్లీషు ఎక్కువగా తగియుండుటచే దానిలోనే మాట్లాడుచున్నామనిరి- తర్వాత సర్ అక్బర్ గారి సామర్థ్యమును, వివిధవిషయనైపుణ్యమును మెచ్చుకొని, వారుఈరాష్ట్రమునకు చేసిన మేల్లను పేర్కొని, వాటినన్నిటిని అంతకంటెనెక్కువవారలు చేయుచో ౧౦ మందికి పూర్తిపని యుండగలదనిరి-

సర్ అక్బర్ గారు ఇపుడు క్రొత్తకార్యప్రణాళికనిచ్చి తామిదివరకు చేసియుండిన ఘనకార్యముల కింకొకదానిని చేర్చుచున్నారని చెప్పినచో మంత్రుల రహస్యమునుదీనినిగాని బైటపెట్టినట్లు కాజాలదని నమ్ముచున్నామనిరి- ఆ కార్యప్రణాళిక నాచరణలోయుంచినచో, రాబోవు కొలదిసంవత్సరములలో అభివృద్ధి ఇదివరకెన్నడుగాని లేనంత యుండగలదనిరి-

తర్వాత మెహిదీయార్ జంగ్ గారు అక్స్ఫర్డు విశ్వవిద్యాపీఠముయొక్క "డాక్టర్ అఫ్ సివిల్ లాస్" బిరుదుపోయిన ౫౦ ఏండ్లలోను ఒక్కభారతీయునికి మాత్రమే వచ్చియుండెననియు, అతనుకూడ హైదరాబాదీయుడేయగు సర్ సాలార్ జంగ్ అనియు, ఈడిగ్రీ కేంబ్రిడ్జి యల్ యల్-డి- కంటె గొప్పదనియు చెప్పిరి- [మధ్యలో "కొందరు కేంబ్రిడ్జి పెద్దలపోలిక వాక్యము లీహాలులో వినబడుచున్నవి-" అనిరి-]

## మ: ఘ: వ: నైజాంస్టేటు రైల్వే

నెం. 101 షటిల్ కు కాలముల మార్పులు

ఇందుమూలముగా అందరకు తెలియజేయుట యేమనగా, 15 అగస్టు 1937 ఆదివారమునుండి భోనగిరినుండి హైదరాబాదుకు వచ్చు షటిల్ బండి వచ్చుకాలములో యీక్రిందివిధముగా మార్పులుగలుగును.

| | | 101 డౌన్ |
|---|---|---|
| | | గం. ని. |
| భోనగిరి | పోక | 7—24 |
| బీబీనగర్ | ,, | 7—40 |
| ఘట్ కేసర్ | ,, | 7—59 |
| మౌలాలి | ,, | 8—27 |
| శికింద్రాబాదు | రాక | 8—39 |
| | పోక | 8—50 |
| హైద్రాబాదు బి. జి. | రాక | 9—04 |

| | | 101 అప్ |
|---|---|---|
| హైద్రాబాదు బి- జి | పోక | 9—18 |
| శికింద్రాబాదు | రాక | 9—45 |

---

## విన్నారా!

చెకుముకి శాస్త్రి

మదరాసు రాష్ట్రమందు జస్టిసు పక్షమువారలు అధికారములో నుండినపుడు ఆ పక్షీయులందరును అధికారమువహించి తమ పక్షీయులు చేయుచుండిన పనులను సంపూర్ణముగ సమర్థించుచునేయుండిరి. ఇప్పుడదే యధికారస్థానమున కాంగ్రెసు అడుగుపెట్టినది కాని కాంగ్రెసుమంత్రులు అడుప్రతిఅటను కాంగ్రెసువారలే సాగనిచ్చునట్లు కానరాదు- మదరాసురాష్ట్ర శాసనసభయొక్క ప్రథమాంగమగు అసెంబ్లీలో సభ్యులకందరికిని నెలకు రూ౧౦౦ లజీతము ఏర్పాటుచేయుటకు ప్రధానమంత్రిగారు తలపెట్టినట్లు తెలిసినతర్వాత, కొందరు కాంగ్రెసువారలే దాని నాక్షేపించుచున్నారు- ఇట్టియాక్షేపణలు ఆంధ్రపత్రికలో ప్రకటించబడుచున్నవి- శాసన సభాసదులకు గూడ నెలజీతములిచ్చుచో ఇపుడు మంత్రుల జీతములును, వారల కార్యదర్శులజీతములును, శాసనసభాసదుల నెలజీతములును, ఇతరములగు పైవారలందరి అలవెన్సులును కలిసి పూర్వపు జస్టిసు మంత్రివర్గములకైన వ్యయము కంటె ఎక్కువయగుననియు, ఇది న్యాయము కాదనియు—ఈఆక్షేపకులవాదము బహుశా ఇట్టియాక్షేపణలన్నియు మంత్రి సర్గముయొక్క మొదటి అభిప్రాయమును మార్చియుండునేమో! ఇపుడు మదరాసురాష్ట్ర ప్రధాన మంత్రిగారు అసెంబ్లీసభ్యులకు మాత్రమే జీతములేర్పాటు చేయదలచినట్లును, అదియు నెలకు రూ-౭౫ లజీతము, సభయుండు రోజులలో రోజుకు రూ౭౪ల అలవెన్సుమాత్రమే యుండగలదని అనుకొనినట్లును తెలియుచున్నది కానిదీనికికూడ కాంగ్రెసువారలు ఇష్టపడనట్లేయున్నది- "ఈజీతమే ప్రతినెలకు రూ ౫౦ వేలకుపైగానగును- సంవత్సరమునకు రెండున్నరలక్షల రూపాయలగును- ఇంత మొత్తమునిట్లే వ్యయపరుపబూనితో తెలియరాదు- జీతములిచ్చుపద్ధతి నూతనముగ ప్రవేశపెట్టుటవలన యొక్కువ లాభమును అగపడదు-......ప్రజలలో చాలమంది యీజీతమేర్పాటునకు సమ్మతించరు-కాబట్టి యీజీతమిచ్చుపద్ధతి విడిచి పూర్వమువలెనే యీపదవులను గౌరవ మాత్రములుగ చేయించవలయునని ప్రార్థన...... దేశమింకను క్లిష్టపరిస్థితులనుండి తేరుకొనలేదు- కాంగ్రెసు మంత్రులు ప్రథమమున......దేశమునకును, బీదకర్షకులకును తగు సదుపాయములొనర్చి యాపిమ్మట వారువేతనములు దీసుకొన్న సమంజసమేయగును-"అని "కాంగ్రెసు అభిమాని"గత శనివారమునాటి ఆంధ్ర పత్రికలో తన అభిప్రాయము వెల్లడించినాడు- శాసనసభాసదులకు జీతములిచ్చుటలోచన ఇంతవరకు కాంగ్రెసువారు అధికారము వహించుచున్న రాష్ట్రములలో ఒక్క మదరాసులోనేయుండుటయు, తక్కిన వాటిలో లేకుండుటయును ఆక్షేపణయొక్క బలమును హెచ్చించుచున్నది.

* * * *

ఇంతకంటె ఆశ్చర్యకరమైనది శాసనసభలోనే కాంగ్రెసు సభ్యులుగ నున్నవారి ఆక్షేపణలు-త్వరలో మదరాసు అసెంబ్లీసమావేశము జరుగబోవుచున్నది. అసెంబ్లీసమావేశమందు సభ్యులెవరుగాని ప్రశ్నలమూలమున తాము తెలిసికొనగోరినవిషయమునడిగి తెలిసికొనవచ్చుగలదు. అనేకసభ్యులు అట్టిప్రశ్న లడుగుటకు నోటీసులను పంపియున్నారు- ఆ ప్రశ్నలలో కాంగ్రెసు మంత్రివర్గమువారి చర్యల నధిక్షేపించువనిగనున్నవనియు, అందుచే అసెంబ్లీ కాంగ్రెసుపక్ష సభ్యులనుసమావేశబరచి; ప్రధానమంత్రి [పక్ష నాయకుడు]ఆప్రశ్నలను ఉపసంహరించుకొనవలసినదిగ విన్నవించుకొనుననియు తెలియుచున్నది- ఈవార్తయు కాంగ్రెసువారలు మంత్రివర్గములోనున్నది తమవారలేయైనను, వారలయాటలవన్నిటిని విచ్చలవిడిగ సాగనిచ్చుటకు సంసిద్ధముగ లేదని స్పష్టపరచుచున్నది-కనుక ముందుముందు ప్రధానమంత్రి శాసనసభలోని కాంగ్రెసుపక్షీయులందరిని అప్పుడప్పుడు సమావేశపరచుచు, వారల అభిప్రాయములను కార్యమును నిర్ణయించుకొనుటకుముందే కనుగొని, వారలను సమాధానపరచుట అతిముఖ్యమని తోచుచున్నది- లేనిచో మంత్రివర్గమునకు విక్షతపరిస్థితు లేర్పడగలవు. బొంబాయి, మధ్యరాష్ట్రము బీహారులలో శాసనసభా కాంగ్రెసుపక్ష సమావేశములు విషయనిర్ణయమునకు ముందు తఱచుగా జరుగుచు ముందుకష్టములను రానీయకుండచేయుట గమనించదగిన విషయము.

* * * *

కాంగ్రెసు మంత్రుల చర్యలు కొందరికి తమాషాగావున్నవి. కాంగ్రెసుమంత్రులు నిరాడంబరముగ ఏదోఒకధోవతి, ఒకచొక్కాయ, మాత్రముధరించిన చాలునని గాంధిమహాత్ముడు సూచించియుండెను.మదరాసురాష్ట్ర ప్రధానమంత్రి "రేఖామాత్రమైనను "ఆమహాత్మునియాజ్ఞను మీరలేదు కాంగ్రెసుమంత్రివర్గముల ఈనిరాడంబరత్వమును వ్యంగ్య చిత్రముల మాపించదలచి మదరాసు మెయిల్ పత్రికయొక్క చిత్రకారుడు రాజగోపాలాచారిగారు ప్రతిరోజు ఉదయము ౮ గం లకేలేచి తనగుడ్డల నుతుకుకొనుచున్నట్లే చిత్రించినాడు- ఈచిత్రములు పాఠకుల కెంతో వినోదముగ వినో

దింపజేయుచున్నవని వినుచున్నాను. ఒకప్పుడు సర్. కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు "గోచిపాత స్వరాజ్యము"నినది ఆపూర్వముగ ఆచరణలోకి వచ్చినపుడు అదిఆనేకులకు వినోదము కలిగించుటసహజమే?

* * * *

### మంత్రులు నాట్యములు సృష్టించలేరు

కాంగ్రెసువారలు మంత్రులుకావడమెట్లున్నా ముందు మాకదికావలె, ఇదికావలెనను మొఱలతో వారలకు దిక్కుతోచకుండవచ్చెను. ౩ అగష్టు ౧౯౩౭ నాడు సాయంత్రము మదరాసు యగ్మోరులో నర్సులసంఘమువారు మంత్రుల గౌరవార్థము చేసినవిందుసందర్భములో తమకష్టముల నేకరువు పెట్టుకొని వాటిని తొలగించుటకు కోరిరి.ప్రభుత్వవైద్యశాలలలోని నర్సులలో ప్రభుత్వపు నర్సులు ప్రైవేటుగ వైద్యముచేసికొనుటకు అనుమతింపబడియుండ, ప్రైవేటునర్సులకు అసౌకర్యము లేకపోయెననియు, నర్సుల మెడికల్ రిజిస్టరు ఏర్పాటు చేయబడినప్పటికిని డాక్టరుశిక్షణపొందని నర్సులను తమసహాయము చేయుటకై నియమించుకొనుచున్నారనియు, జనరల్ అస్పత్రినర్సులకు వసతిగృహము లొసగబడుటలేదనియు: మరొకనర్సుల సంఘమునకు రూ ౨౦౦ లు ద్రవ్యసహాయము చేయుచున్నట్లు తమసంఘమునకు చేయుటలేదనియు, తమపనికాలము రోజుకు ౮ గం. లలెక్కకు తగ్గించవలెననియు, కొంతకాలముక్రింద జనరల్ అస్పత్రి నర్సులు తమ ఆస్తిని కోల్పోయినప్పుడు పోలీసువారుగాని సర్జన్ జనరల్ గాని తమకు ఏవిధముగగాని అవిషయమై తోడ్పడియుండలేదనియు, యూరోపీయ నర్సులు రప్పించబడకుండుటకై ఆరోగ్యశాఖమంత్రితగిన చర్యతీసికొనవలసి యున్నదనియు విన్నవించుకొనబడెను. ఇటువంటి కోరికలనన్నింటిని తీర్చుటకు మాటఇచ్చినచో దబ్బెక్కడినుండి రావలెను! రాజగోపాలాచారిగారు తెలివిగలవారు కాన ప్రత్యుత్తరమిచ్చును, మొట్టమొదటనే నర్సులకు కష్టములులేవనియే తాను అభిప్రాయ పడుచున్నాననిరి. రోగనివారణలో నర్సులసేవయొక్క ప్రాముఖ్యతను చెప్పి, డాక్టర్ రాజన్ గారికి సంబంధించిన శాఖలో తాను జోక్యముకలిగించుకొన వీలులేదనిరి. ఇన్నిదినములుగా నర్సులు ఉపేక్షించుటచే ఏర్పడిన ప్రస్తుతపరిస్థితులను ఒక్కసారిగ మార్చుటకు వీలులేదని చెప్పి, తుదకు తమకు కొంతసివనంతయు మంత్రి ఒసగునవితలంచుట పొరపాటుఅనియు,ఆలోచింపదగినవిషయము లెన్నియోగలవనియు పన్ను చెల్లించువారిపై అంతయు అధారపడి యున్నదనియు, మంత్రులు నాణెములను తయారుచేయజాలరనియు చెప్పి నర్సులు శాంతమువహించి ఇతరులకు అదర్శప్రాయముగ నుండవలసినదని కోరిరి. మఱిఎవడైనను విందులచే సన్మానములచే ఉబ్బి తబ్బిబ్బు పడువాడైనచో నర్సుల కోరికవన్నియు తీర్చబడునని వాగ్దానము చేసియుండెడివాడు గదా! ఈప్రకారముగ వాగ్దానములు చేయుచుండిన ప్రతివానును ఒకరికొరకరు విరుద్ధమైనదానిని ఇంకొకరు కోరుచుండుటయు వాటినన్నిటిని మంత్రులు నెరవేర్చుట సాధ్యము గాక వాగ్దాన భంగమగుటయు జరుగును

* * * *

### హిందీప్రశ్న ముందుకువచ్చుట

కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడుటతో హిందీప్రశ్న పూర్వముకంటె ఎక్కువ ప్రాముఖ్యత వచ్చుచున్నది. శాసనసభలలో కొందరు ఇంగ్లీషులో మాట్లాడలేక తమమాతృభాషలోనో లేక హిందీలోనో ఉపన్యసించుచున్నారు. దానికి శాసనమునుసరించి అధ్యక్షుడు సమ్మతించవచ్చును. కాని కొన్నివేళల ఇంగ్లీషువచ్చినవారలుకూడ హిందీలో మాట్లాడుట జరుగగా అధ్యక్షుడు శాసనమునకు సమ్మతించదని ఇంగ్లీషులోనే ఉపన్యసించుటకు విధించుచున్నాడు. ఈపద్ధతి బాగులేదనుచు "హరిజన్" పత్రికలో ఒకవ్యాసమందు మహాదేవ దేశాయిగారు ఏసభ్యుడుగాని స్వభాషలోనైనను లేక హిందీలోనైనను మాట్లాడుట కనుమతి యుండవలెనని సూచించుచున్నారు: హిందీ అనుమానములలో నేర్చుకొనవచ్చును. గనుక, హిందీలో సభ్యులు మాట్లాడు ఏర్పాటు చేయవచ్చునను చున్నారు. ఈవిషయములో శాసనమును సవరించునో ఇంగ్లీషు రానివారు మాతృ భాషలో మాట్లాడుట కనుమతి యుండవలెనే గాని, నిర్బంధముగ హిందీలో మాట్లాడవలెనను ఏర్పాటు ఉండరాదని అభ్యుతేగాక తెలుగులునుకూడ కోరగలరు. శాసనసభలో మాట్లాడుటకై ఇదివరకు నేర్చుకొన్న భాషలు చాలక హిందీకూడ నేర్చుకోవలసిన నిర్బంధము వలన భార మెక్కువగును, ఇప్పుడు కాంగ్రెసు మంత్రివర్గమువారు హిందీని పెట్టించవచ్చును, కాని రేపు ఏకారణముచేతనైనను ఇంకొక మంత్రివర్గము వచ్చినపుడు ఇంగ్లీషు నిర్బంధము చేయబడినచో అవస్థఎట్లుండును? కాబట్టి ఇట్టి చీటికిమాటికి మార్పులు పనికిరావు.

### బులుసు సాంబమూర్తిగారు

మదరాసు అసెంబ్లీ అధ్యక్షులగు బులుసు సాంబమూర్తిగారు అగస్టు మొదటి వారములో కాకినాడకు పోయినపుడు అనేకసన్మానములు జరిగినవి. అందొక వినతి పత్రములో రైతుల కష్టములనుగురించి విన్నవించుకొనబడెను. దానికి సాంబమూర్తి గారు జవాబిచ్చుచు తనకావిషయములు వినతపత్రములలో తెలుపవలదనియు, శాసనసభకు అవి వచ్చినపుడే తనకందు ప్రసక్తిగలదనియు చెప్పిరి. ఆ కష్టములనుగూర్చి మొఱపెట్టుకొన్న వారలకు తీవ్రనిరాశభాగము చిక్కు- అన్నియు ఏమి తెలుసును? గనుక వారలకెంత ఆశాభంగమై యుండునో!

* * * *

### పోలీసు రిపోర్టింగు

ఒరిస్సారాష్ట్రములో ఇకమీదట పోలీసు వారలు బహిరంగసభలకు పోయి ఉపన్యాసములను వ్రాసుకొనుటలో వారుకొనవలసిన అవసరము లేదని ప్రభుత్వమువారు ఆజ్ఞనొసగినారు! కాని గతసూచికలో "రాష్ట్రీయవార్తల" క్రింద హానగల్లువారలలో ప్రతిశుక్రవారము జరుగుచున్న సభలకు గ్రామమందలి పోలీసు పటేలు నాకేదా గరుదెంచి జరుగు ఉపన్యాసములను వ్రాసికొనుచున్నట్లు తెలుపబడినది విద్యావిషయకోపన్యాసములను, వక్తృత్వశక్తి వృద్ధిచేసి కొను నుద్దేశ్యముతో జరుపబడువాటిని పోలీసులు వ్రాసికొనవలసిన అవసరమేమివచ్చినాయని జనులఆశ్చర్యము. శాసనోల్లంఘన భయంకంటె భయములేవియు లేక ఇంతవరకు ఒకయువ రాజద్రోహియని అనుమానించదగినవాడైనను కనపడని హైదరాబాదు రాష్ట్రములో ఒరిస్సాలో చేయబడినదని పైచెప్పబడిన ఉత్తరువు చేయబడినచో పోలీసుల శ్రమ ప్రయాస నష్టదాయకమైన నిజమగు నేరముల విషయమై ఎక్కువశ్రద్ధ వహించుటకు అక్కరకు రాగలదు, అనగా బందిపోట్లు, హత్యలు, దొంగతనములు, కొట్లాటలు- మున్నగునవి ఇప్పటికంటె ఎక్కువ తగ్గగలవు!

---



---

## పోలీసుల అనుమానము కష్టములు

సంయుక్తరాష్ట్రములో ప్రధాన మంత్రియగు పండిత గోవిందవల్లభపంతు గారు వివిధప్రభుత్వశాఖల కార్యదర్శులకు ఉపన్యసించుచు,పోలీసు లికమీదట రాజకీయోపన్యాసములను వ్రాసుకొనుటలో వ్రాసికొనవలసిన అవసరములేదనిరి- ఈమాటను బలపరచుచు "మితవాద" పత్రిక ఇట్లువ్రాయుచున్నది. "పూర్వముపోలీసులు నివేదించుపద్ధతి కావలెనని ఉన్నవానిని తద్విపరీతముగ కనిపింపజేసి, లేనిపోని బాధలు పెట్టుటకు సాధనముగ ఉపయోగించబడుచుండుటచే, ఇకమీదట పోలీసులునివేదించు పద్ధతినిఅపవలెను అని సంయుక్తరాష్ట్ర ప్రధానమంత్రిగారు వెల్లడించినఅభిప్రాయముతో ఎవరుగాని భిన్నాభిప్రాయము కలిగియుండజాలరు- మనదేశములో పోలీసులునివేదించు పద్ధతిలో దోషమేమన, అందు నిజము చెప్పుటకన్న ఊహలే ఎక్కువగనున్నవి- ఇందులకు అపనిచేయుటకు నియోగించబడినవారిని దూషించుము- మేము దూషించునదంతయు పరిపాలకులు పరిపాలించుదేశములోని ప్రజలనే నమ్మకుండుట మూలముగగల పద్ధతి-

## కీ. శే. సర్ రాస్ మసూద్ గారు

"డాక్టర్ సర్ సయ్యద్ రాస్ మసూద్ గారి మరణముచే భారతీయ విద్యాబోధనసమర్థుల నుండి దూరదృష్టిగల విజ్ఞానిని కోల్పోవలసివచ్చినది- హైదరాబాదులో విద్యాశాఖాధికారిగనున్నప్పుడు వారు సంస్థానములో చాలగొప్ప విద్యాభివృద్ధిని సాధించిరి- ఉర్దూభాషలో విద్యనేర్పు ఉస్మానియా విశ్వవిద్యాపీఠ స్థాపనకు వారిదూరదృష్టి యేమూల ప్రేరణము-"

---

